# రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి

పురాతన కంబోడియా లోని ఖ్మెర్ లు అనే ప్రజలు ఏర్పరుచుకున్న రాజ్యమును కాంభోజ రాజ్యము అని భారతీయులు పేర్కొన్నారు . వీరు ఆంగ్కోర్ వాట్ {Angkor Wat }అనే పట్టణము నిర్మించారు. అతి పెద్ద దైన మొదటి ప్రాంగణంలోపల - ఒక పెద్ద ప్రాంగణము - ఉండేట్లు వీరు ఈ పట్టణ నిర్మాణము చేశారు . "laterite " అనబడే మట్టి గాలి తగిలిన కొద్దీ గట్టి పడి రాయిలాగా మారుతుంది - రాయిలాగా మన్నుతుంది- అని కనిపెట్టిన వీరు దానిని వుపయోగించి గొప్ప వైన నిర్మాణాలు చేశారు . కాంబోజ ప్రజలు రాతి కట్టడాల నిర్మాణం లో తమకు గల నైపుణ్యాన్ని వుపయోగించి అనేక గుడుల సముదాయాలను నిర్మించారు . అన్ని ఆలయాలను కలిపి "ఆంగ్కోర్ థోమ్ " "అంటారు . నేడు ఈ "ఆంగ్కోర్ వాట్ " ప ట్టణము ప్రపంచ ప్రసిద్ధి గాంచిన టూరిస్ట్ డెస్టినేషన్ .

ఆంగ్కోర్ యొక్క పెద్ద ప్రాంగణము లో -- Bayon "బయోన్" గుడి ఉంటుంది . "బయోన్" అంటే మన దేశపు ఇంద్రుని నివాస భవనమైన "విజయన్త " లేదా "వైజయంతి ," లాంటిది అని . ఇందులో ని Bayon "బయోన్" గుడి యొక్క నాలుగు శిఖరాలు నవ్వుతున్న దేముడు లేదా మనిషి మొఖం వంటి ఆకృతిలో ఉంటాయి . ఇతడు - తన సృష్టిని చూసి తానే మురిసిపోతూ మందహాసం చేస్తున్న బ్రహ్మ దేమునిగా చెపుతారు . కంబోడియాలో బుద్ధిజం ప్రవేశము తర్వాత ఈ బ్రహ్మముఖాలను , మహాయాన బుద్ధిష్ట్ లకు చెందిన "లోకేశ్వర " అనే బుద్ధుని ముఖాలు అని పేరు మార్చి ప్రచారం చేశారు . ఇక్కడనే " త ప్రోహ్మ" అనే మరొక బ్రహ్మ దేముని గుడి వుంది . ఈ గుడి మనకు తెలివిని ఒసంగిన బ్రహ్మ కు చెందినది . { బ్రాహ్మలు అనేక మంది ఉండి-- ఒకరి తరువాత ఒకరు సృష్టి చేస్తూ వస్తూ ఉండగా - మధ్యలోని ఎవరో ఒక బ్రహ్మకు - మానవులకు మొదటిలో లేనంత ఎక్కువ తెలివిని ఇవ్వవలెనని తోచింది . ఆలా ఇచ్చిన బ్రహ్మ దేముడే " త ప్రోహ్మ" అనే బ్రహ్మ } ఈ గుడి బౌద్ధ మందిరంగా మార్చ బడినాక ఈ గుడిలో వున్న మూల విరాట్టును " ప్రజ్ఞాపారమిత "అని పిలిచారు . " ప్రజ్ఞాపారమిత "అంటే కూడా తెలివిని ఇచ్చిన వాడు అనే అర్థము . ఈ " ప్రజ్ఞాపారమిత " అనే పేరును బట్టి ఈ గుడిలో మొదటిగా వున్నది

బ్రహ్మ దేముడే అని నిర్ధారణ చేశారు . ఇక్కడే వున్న  ఇక్కడ వున్న మరొక గుడి పేరు" ప్రేఆహ్  ఖాన్ ". {Preah Khan } ఇది  విష్ణు మూర్తి కోసం నిర్మించారు . బౌద్ధము వ్యాప్తి చెందినాక దీనిని బౌద్ధ సన్యాసులకు విద్యాలయంగా మరియూ వసతి గృహంగా మార్చాబు. "ఆంగ్కోర్ " పట్టణము యొక్క రొండో ప్రాంగణములో "  శివునికి గుడి  లేదు . కానీ  మొదటిది వెలుపలదీ - అతి పెద్దది అయినా  ప్రాంగణములో శివుని కోసం  అనేక చిన్న  గుడులు నిర్మించారు  . కంబోడియాలో  "టెంపుల్  అఫ్  ప్రేఆహ్  విహీర్ " పేరిట- అంతర్జాతీయ ఖ్యాతి పొందిన  శివుని  గుడి ఒకటి ఉంది.  ఇది Angkor కి 204  కిలో మీటర్ల దూరంలో  ఉంటుంది .   శివ కేశవుల కిద్దరికీ ఒకే ప్రాంగణంలో పెద్ద గుడులు కట్టరాదనే భారతీయ పద్దతిని వీరుకూడా అనుసరించారు . ఇలాంటి గుడులే కాకుండా గ్రంధాలయాలు , విద్యార్థులకు మందిరాలు కూడా ఈ  ఆంగ్కోర్ లో నిర్మించారు . ఈ భారీ స్థాయి నిర్మాణ నాగరికత వెనుక కంబోడియన్లకు సాయ పడిన  శక్తి ఏమిటంటే? -   అది నీరు .  నీటిని అదుపుచేసి దాని శక్తిని ఉపయోగించుకోవటం  అనే ఆలోచన పై ఆధారపడి వీరు భారీ నిర్మాణాలకు పూనుకున్నారు .ఇకముందు ముందు -- నీటిని గురించి దాని శక్తిని గురించి కంబోడియా వారికి వున్న అభిప్రాయాలు తెలుసుకుందాము .



.

కంబోడియాలో ని ఆంగ్కోర్ అనే పట్టనాన్ని హైడ్రాలిక్ సిటీ లేదా నీటి పట్టణము అని వ్యవహరిస్తారు . ఆ కాలానికి ఎంతో గొప్పది - అధునాతనము -అభివృద్ధి చెందినది ఐన ఈ నగరము కాలక్రమేణా కను మరుగు అయి పోయింది .

కంబోడియా వారు నీటి రంగపు నిపుణులు - కాలువలు , రిజర్వాయరులు , కాల్వల ద్వారా రవాణా మార్గాలు ,"barays" అని పిలవబడే దీర్ఘ చేతురస్రాకారపు నీటి చెరువులు నిర్మించి వాటి తో ఆంగ్కోర్ పట్టణాన్ని అభివృద్ధిచేశారు . ఈ పట్టణంలో సాగు నీరు , తాగు నీరు, జల రవాణా కోసం , స్నానాల కోసం అని వేరు వేరు కాల్వలు ఉండేవి . కొన్నికాల్వలు కేవలం చేపల పెంపకం కోసమే ఉండేవి . వాటి ద్వారా చేప అనే ఆహారము కూడా ఇంటికి డెలివరీ అయ్యేది. అంటే ఎవరో ఒక మత్స్య కారుడు వచ్చి ఒక ఇంటి ముందుకుండా పారే కాల్వలోనుండి చేపలను పట్టి ఇంట్లో ఇచ్చి పోతాడు అన్నట్లు .

కంబోడియన్లు యొక్క " Barays, బరాయ్స్" అన బడే దీర్ఘ చతురస్రాకారపు నీటి రిజర్వాయర్లను - ఎంతో భారీగా -- ఒక్కొక్కటి 8 కిలోమీటర్ల పొడవు 2.1 కిలోమీటర్ల వెడల్పు వుండే లాగా నిర్మించారు . ఈ నిర్మాణాల వల్ల "ఖేర్మ్ "లేదా "కాంభోజ" ప్రజలు నీటి రంగపు నిపుణులు అని పేరు పడ్డారు . ఈ "బరాయ్స్" లోకి - పొంగిపారే నదుల నీరు , కొండలనుండి జారి వచ్చే నీరు చేరేట్లు వీరు ఏర్పాట్లు చేసుకున్నారు .ఈ "బరాయ్స్" ప్రజల కోసమే నిర్మాణము అయినా గానీ - చివరికి , అవి రాజుగారి యొక్క శక్తిని ప్రజలకు ప్రదర్శించటానికి పనికి వచ్చే నిర్మాణాలుగా మారాయి ." మా రాజు గారు ప్రకృతిని లొంగ తీసి దానికి ముక్కు తాడు వేసిన మొనగాడు " అని ప్రజలతో అని పించుకోవాటం కోసం అని కూడా రాజులు ఈ నిర్మాణాలు చేపట్టారు .

ఆంగ్కోర్ చుట్టూ లోతైన కందకాలు తవ్వి వాటిని నీటితో నింపారు .ఈ కందకాలు నాలుగు మీటర్లు లోతు, 650 అడుగుల వెడల్పు ఉండేట్లు నిర్మించారు. ఇందులో 50 మిలియన్ క్యూబిక్ మీటర్ల నీరు పడుతుంది . వర్షపు నీరు పారు కుంటూ వచ్చి ఈ కందకం లోకి నిండేటట్లుగా ఏర్పాట్లు జరిగాయి . ఆంగ్కోర్ వాట్ గుడుల లో ఒక పెద్ద గుడి విష్ణు మూర్తికి చెందినది . విష్ణుమూర్తి సముద్రము మధ్యలో ఉంటాడు అనే

భారతీయ  భావనకు  అనుగుణంగా వీరు గుడి చుట్టూ కందకాలు తవ్వి అయన సముద్ర పు మధ్యన ఉన్నట్లు చూపించ దలిచారు . ఈ విష్ణువు  గుడి-  బుద్ధుని యొక్క గుడిగా రూపాంతరం చెందినాక , విష్ణువు చుట్టూ ఏర్పరచ బడిన ఈ  సముద్రము కాస్తా - బుద్ధుని తల చుట్టూ ఏర్పడిన పాల పుంత కు సూచిక అయ్యింది.
{ విష్ణువు పాల పుంతలో నివాసం  ఉంటాడు అని మన పూర్వీకులు అనగా - కాలక్రమేణా అది పాల సముద్రంగా వ్యవహరించ బడిందేమో ?  అని మనము ఆలోచించ వచ్చు . }   కంబోడియన్లు  నీటి మీద పట్టు సాధించటం వల్లనే ,  వారు   విష్ణు మూర్తి గుడి చుట్టూ  ఒక సముద్రమును కల్పించటం అనే   ఊహకు రూపము ఇచ్చారు  . కందకంలో నీరు కారణంగా గుడి చుట్టూ  ఉన్న  నేల తడిసిన స్పాంజీ లాగా  మారేది అనుకుంటే,  ఆ గుడి ఆ స్పాంజీ మీద పెట్టిన కుండలాగా అందులోకి కూరుకొని పోయి స్థిరంగా ఉండేది . భూకంపాలు వచ్చినపుడు ఈ భారీ గుడి ఒడిదుడుకులకు లోను అయి కూలి పోకుండా ఉండాలన్న ఆలోచనతో ఈ కందకాన్ని   ఈ ఏర్పాటు చేశారు అని నేటి ఇంజనీర్లు భావిస్తారు .

నీటి మధ్యలో గుడి వున్నది కదా ?  గుడి  బరువు కందకం లోని నీటి మీద  ఒత్తిడి కలుగ చేసి ఆ  నీరు భూగర్భ జలాల్లోకి వెళ్లి పోయేట్లు చూసేది . భారత దేశపు ఆలయాల పక్కన కూడా చెరువులు , కోనేరులు , పుష్కరిణులు అనే పేరుతో నీటి నిల్వలు ఉంటాయి .  ఈ నీటి నిల్వల  ద్వారా గుడికి సురక్షిత కలుగచేయటం -అలాగే గుడి బరువుకు నీరు  భూమిలోకి ఇంకి భూగర్భ జలాలు గా మారేట్లు చూడటం అనే ఆలోచన ఉండి ఉంటుంది . వీటి  ప్రయోజనం తెలియక నేటి మన -జనం వీటిని పాడు పెట్టుకుంటూ వున్నారు అనుకుందాం .

నీరు నింగి నుండి-  అంటే భగవంతుడు వుండే చోటునుండి కిందకు జారు తున్నది . కాబట్టి నీరు   దేవ లోకానికి చెందినది అని .నీరు  దేవతలకు  చెందినది కాబట్టి వారు దానిని  దేనికో ఒకదానికి వాడుకుంటూనే  వుంటారు అన్న ఆలోచన కంబోడియన్లకు ఉండేది .{మీకున్న వస్తువును ఎంతో అరుదుగా నైనా సరే మీరు ఎప్పుడో ఒకప్పుడు వాడుకోక పోరు కదా ?  అలాగన్న మాట }.   " ఓ దేముళ్ళారా మీరు నీరు వాడుకుంటున్నందుల  - నీటికి పవిత్రత అనే గుణం అబ్బింది  అని చెప్పటం కోసమనే మనము దేముళ్ళకు నీటి అభిషేకాలు నదులలో పుణ్య స్నానాలు చేస్తాము  . కంబోడియాని  కూడా అనేక మంది రాజులు పరి పాలించి .ఎన్నో రకాల మార్పులను తల పెట్టి వుంటారు కదా ? . కానీ ఏ ఒక్క రాజు కూడా నీటి యొక్క శక్తిని , పవిత్రతని తిరస్క రించలేదు. అందువల్ల కంబోడియా లోని నీటి నిర్వహణ కు చెందిన ఏర్పాట్లు

శతాబ్దాల పాటు నిలిచి ఉండి నేటికీ మనుగడలో వున్నాయి . ప్రజలలోను, రాజులలోను ఎన్ని తరాలు వచ్చినా ఎవరూ కూడా నీటి ని నిర్లక్ష్యం చేయ కూడదు అన్న ఆలోచనతో కంబోడిన్లు నీటికి దేమునికి ఓ పవిత్ర బంధాన్ని ఏర్పరుస్తూ అనేక పూజా పద్ధతులు ఏర్పరిచారు. మనకు కూడా నీటి తో జత పడి అనేక ప్రార్ధనలు పూజలు ఉన్నపటికీ మనము నీటి యొక్క శక్తి పై - పవిత్రతపై , శుద్ధత పై సరి ఐన అవగాహన లేకుండా వున్నాము అని నా భావన .
ఆంగ్కోర్ టెంపుల్ చుట్టు పక్కల వున్న ప్రకృతి సౌందర్యాన్ని - నేలలో బిగించిన ఒక పెద్ద అద్దములో చూసినట్లు చూడటానికి వీలుండేలాగా కూడా కంబోడియన్లు కొన్ని నీటి కుంటలను కూడా నిర్మించు కున్నారు . మంద్రంగా పారుతూ వుండే నీటికాలువ వెంట నడుస్తూ అందులో ప్రతిభలిస్తున్న ప్రకృతిని ఒక సినిమా చూసినట్లు చూసే అవకాశాన్ని కూడా కంబోడియన్లు కల్పించుకున్నారు .నీరు అనేక చిత్ర విచిత్రాలకు మూలం అనే భావనతో - వీరు - అనేక వింత మృగాలు , జీవులు నీటిలో నుండి బయటికి వస్తున్నట్లు శిల్పాలు చెక్కారు .

నీటినే నమ్ముకుని నీటి ఆధారితంగా తమ నాగరికత నిర్మించుకున్న కంబోడియన్లు చివరికి నీటి మూలకంగానే అధోగతి పాలైనారు . పెరుగుట విరుగుట కొరకే అన్నట్లు - ఎక్కువగానూ గజి బిజీగానువిస్తరించిన చెరువులు , కాలువల నిర్వహణ కోసం అని రాజుల ఖజానాలు ఎక్కువగా ఖర్చు పెట్టవలిసి వచ్చింది . తేలికగా అర్ధం చేసుకోవటానికి వీలులేని కదలికలు గల నీరు ఎప్పుడూ ఎదో ఒక సమస్యలను కలుగ చేస్తూ ఉండేది . ఓ కాలువవల్ల పంట పొలాలకు నీరు అందుతుంది అని భరోసాకి పోయినపుడు- ఆ కాలువలో ఎదో పూడిక ఏర్పడి పంటపొలాలకు నీరు అందక వ్యవసాయము దెబ్బతిని పోయేది .కరువు పరిస్థితులు ఏర్పడేవి .

ఒక్కొక్క అవసరానికి ఒక్కో కాలువ ఉండేదని మొదటిలో చెప్పుకున్నాము . కానీ ఏ కాలువ ఎందు కోసం ఏర్పడిందో - అది అందు కోసమే వాడ బడటం అనేది తగ్గి పోయి, వాటి నిర్వహణ క్లిష్టమై పోయింది . అతిగా కూడ పెట్టబడిన , నీరు భూమి మీద కలుగచేసే ఒత్తిడిని. చెట్ల మీద చూపే ప్రభావాన్ని కంబోడియన్లు సరిగా అంచనా వేయలేక పోయారు . భూమిలో ఎక్కువ నీరు ఉన్నందువల్ల వృక్షాలు అతి త్వరగా పెరిగి మహా వృక్షాలు గా మారి , ప్రజలు నివసించే నేల ను కూడా అరణ్యములాగా మార్చ సాగాయి . మొదట్ల నీరు ఇచ్చే సౌకర్యాలకు అబ్బుర పడి ఆనందించిన ఆంగ్కోర్ పట్టణ వాసులు - చివరి చివరికి ప్రతి నిముషమూ నీటి మధ్యనే జీవించటానికి విముఖత చూపి - నీరు తక్కువ గా వుండే వేరే ప్రాంతాలకు వెళ్లి పోయారు . ఇట్లా

ఆంగ్కోర్ అనే పట్టణ ము నిర్మానుష్యము అయి పాడు పడి పోయింది . నేలలోని నీటి వల్ల ఎదిగిన మహావృక్షాలు ఆంగ్కోర్ టెంపుల్స్ ను కూడా ఆక్రమించి మింగి వేసాయి . చివరికి ఆంగ్కోర్ పట్టణము క్రమంగా అరణ్యముచేత ఆక్రమించుకో బడి , ఎక్కడికో మాయం అయినట్లు మాయం అయి పోయింది . ఫ్రెంచ్ అన్వేషకుడు ఐన హెన్రి మౌహోట్ అనే అయన 1860 లో మాయం అయిన ఈ పట్టణాన్ని తిరిగి కనిపెట్టి ప్రపంచానికి చూపించాడు . ఆంగ్కోర్ గుడులు పెద్ద పెద్ద చెట్ల మధ్య చిక్కకొని ఉన్నట్లు చూపే అనేక చిత్రాలు మనము చూస్తాము . అలా ఎందుకు జరిగిందో అనేది తెలుసుకోవటమే నా ఉద్దేశ్యము .

రచన సేకరణ వివరణ వారణాసి ఉమా శ్రీ రామ కృష్ణ అఫ్ అమరావతి .

.






**Above photo is the author with his grand daughter aparna gouthami vijayalakshmi on 17-5-25**

# The end